# THE ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

## DEBATES

(PART II – *Proceedings other than Questions and Answers*)

OFFICIAL REPORT

---

wenty eighth Day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Saturday, the 22nd February* 1958

The House met at Two of the Clock

[MR SPEAKER IN THE CHAIR]

Questions and Answers

[No Questions Part I—Not published]

## Resolution on the demise of Maulana Abul Kalam Azad

మిస్టర్ స్పీకర్ —పిడుగువంటి వార్త మనకు వచ్చింది భారతదేశం ఉంతా అంధకారంలో మునిగింది ఇరువధియవ శతాబ్దపు మానవకోటి యొక్క చరిత్ర ఉజ్వలమైనది ఆసియా ఖండంలో ఉండే చైనామొదలుకొని ఈజిప్టు వరకు, బౌద్ధ, హిందూ, మహమ్మదీయ దేశములన్నీ పాశ్చాత్య సామ్రాజ్యవాదులమీద ఎదురు తిరిగి స్వాతంత్ర్య పోరాటంచేసి జయంపొందినవి ఇంకా కొద్దిగా పొందుతున్నవి మహాపురుషులు పుట్టారు ఈ ఆసియా ఖండం పునరుద్ధరణకు, పునరుజ్జీవనకు, వికాసానికి, తమ యావత్తు జీవానాన్ని అర్పించినటువంటి మహాపురుషుల్ల పుట్టారు డా సన్‌యట్‌సేన్, మహాత్మా గాంధీ, అబుల్ కలామ్ ఆజాద్, ముస్తఫా కమాల్‌పాషా, రాజాఖాన్ ఖేన్వ్, అమీనుల్లా, మొదలైనటువంటివారు అందులో అగ్రగణ్యులు మౌలానా ఆజాద్ మన హిందూదేశానికివచ్చి కాపురం ఉన్నారు హిందూదేశాన్ని అంతా తన మాతృదేశంగా చేసుకున్నారు 1907 వ సంవత్సరంనుంచి ఇప్పటి వరకూ తదేక దీక్షతో భారతదేశ స్వాతంత్ర్య పోరాటంలో నిమగ్నులైనారు తరువాత భారతజాతి యొక్క పునరుద్ధరణకోసం ముఖ్యమైనటువంటి ఉద్యోగాలను నిర్వహించి, పేరు ప్రతిష్టలు తీసుకొచ్చినటువంటి మహాపురుషుడు ఆయనకు 69 సంవత్సరాలకంటే ఎక్కువలేవు ఆయన ఈ తెల్లవారు జామున, రెండు గంటలకు, దివికి ఏగినటువంటి వార్త చాల ఘోరమైనటువంటి వార్త దీనిని గురించి మన సభానాయకులు ఒక తీర్మానాన్ని ప్రతిపాదించి మన ఎదుట సంగతులన్నీ చెబతారు

*The Chief Minister (Sri N Sanjeeva Reddi) I beg to move

"That this House places on record its deep sense of sorrow at the demise of Sri Abul Kalam Azad, Union Minister for Education, and one of the greatest leaders of Indian Nation, and conveys its sincere condolence to the Prime Minister of India and members of the bereaved family"

అధ్యక్షా! మీరు చెప్పినమాటలకన్నా నేను వారినిగురించి ఎక్కువ చెప్పవలసిన అవసరం లేదు మౌలానా ఆజాద్‌గారి చరిత్ర భారత దేశంలో తెలియనివారుండరు గడచిన 50 ఏళ్ళగా తీవ్రస్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నటువంటి మహానాయకులలో వారు ఒకరు రాజకీయ పోరాటానికన్న, కులతత్వంపై, మత ప్రచారంపై, రాజకీయాలకు మతానికి ముడి పెట్టడంపై వారు జరిపిన పోరాటం అద్వితీయమైనది మహమ్మదీయులు ఆరోజులలో చాలా మంది Muslim League ను బలపరుస్తూ, ఆజాద్‌గారిలాంటి పెద్దవ్యక్తిని దేశ ద్రోహి క్రింద, మతద్రోహి క్రింద, భ్రష్టుని క్రింద, తిట్టుతున్న రోజులలో కూడ, తనయొక్క ముఖ్య principles ఏమాత్రం సడలించకుండ, వాటిని అమ్ముకోకుండ, గట్టిగా నిలిచి, జాతీయతను మహమ్మదీయులలో ప్రచారం చెయ్యడానికి ప్రయత్నం చేశారు వారి ప్రచారం ఆనాటి రోజులలో మహమ్మదీయులకు అర్థంకాలేదు కాని మతవిద్వేష ప్రచారం ద్వారా, జరిగిన ఫలితాన్నిబట్టి, దుష్ఫలితాన్నిబట్టి, తరువాత చాలమంది ఈ కులతత్వంవల్లవచ్చే ప్రమాదాన్ని గుర్తించే వారిని గౌరవించ ప్రారంభించారు సంస్థలుగాని, వ్యక్తిగాని, బలంగా ఉన్నరోజులలో, కార్యక్రమాలను సాధించడం సులభమేకావచ్చు తన సంఘీయులు, తన మతస్థులు, హెచ్చుమంది, తనను ద్వేషిస్తున్నప్పుడు, ద్రోహిగా పరిగణిస్తున్నప్పుడు కూడా, తన న్యాయాన్ని, తన ధర్మాన్ని వదులుకోకుండా, ప్రయత్నించడం అంత సులభసాధ్యమైన, సాధారణ మానవులు చెయ్యగలిగిన కార్యక్రమంకాదు మౌలానాగారివంటి మహావ్యక్తులు మాత్రమే సాధించ గల్గిన విజయం వారు భారతదేశంలో 50 ఏళ్ళుగా కాపురంచేశారన్న చరిత్రను, మనం చదువు కున్నాము ఈనాడు ఆలాంటి మహావ్యక్తిని కోల్పోయాము వారికి సుమారు 70 ఏళ్ళు వయస్సు రెండు మూడు రోజులుగా వారు తీవ్రమైనటువంటి జబ్బుకు గురైనారు మన దురదృష్టంకొద్దీ కడచిన 7, 8 ఏళ్ళుగా వారి ఆరోగ్యం ఏమీ బాగుండలేదు ఎన్నోపర్యాయ ములు మన హైదరాబాదుకు రమ్మని ఈ గడచిన నెలలోనే వారిని ప్రార్థించాను ఆరోగ్యం కొంచెం బాగుంటే తప్పకుండా వస్తానని చెబుతుండేవారు నాలుగు రోజుల పూర్వం నేను ఢిల్లీలో ఉన్నప్పుడుకూడా ధేబర్‌గారి ద్వారా వారికి చెప్పించాను

"ఒక్క పర్యాయం మీరు హైదరాబాదుకు వచ్చిపోవాలి, మీసందేశాన్ని అక్కడ ఉన్నటువంటి ప్రజానీకానికి, ముఖ్యంగా మతప్రచారానికి తలఎత్తే పిచ్చి ప్రజానీకానికి, మీ సందేశం కావాలనీ, శాంతిని నెలకొల్పడానికి, దేశంలో ఈ మతవిద్వేషం తలెత్తకుండా చేయ డానికి, రాజకీయ పరిస్థితులను ఆలోచించేటట్లు, ప్రజానీకాన్ని మరలించేటట్లు మీలాంటివారి ఆశీస్సులు మాకు అవసరం కావున ఒకసారి రమ్మని" కోరినాము నాలుగు రోజులలో ఇంత ప్రమాదం అవుతుందని అనుకోలేదు వారప్పటికే గడ్డిగా అనారోగ్యంగాఉన్నా, ఈ పెరాలిసిస్ రావడం,

మూడు రోజులలో వారు మనకులేకుండా పూర్తిగా పోతారనేవిషయం అప్పుడు ఊహించడానికి వీల్లేకుండా పోయింది మార్చి నెలలోగాని, మరోపర్యాయంగాని, తప్పకుండా వారికిచెప్పి, వచ్చేటట్లు చేస్తానని, ధేబర్ గారు నాతోచెప్పారు మౌలానా ఆజాద్‌గారు పుణ్యపురుషులు వారు కోరినకోర్కె ఫలించింది స్వరాజ్యాన్ని సాధించారు స్వరాజ్యం కొరకు 50 ఏండ్లు కష్టపడ్డారు

దేశం సర్రైన పద్ధతులలో నడుస్తూ ముందుకు పోతూ ఉన్నటువంటి నూర్గానికి సూత్రధారులుకూడా వారే అయినారు జవహర్‌లాల్‌కు అండగా ఉంటూ, సలహాదారుగా ఉంటూ, సోదరుడుగా ఉంటూ, ప్రతి కార్యక్రమంలోనూ, జవహర్‌లాల్‌గారికి కుడిభుజంగా ఉంటూ, నడుపుతూ ఉన్న విషయం మీకందంకీ తెలుసు స్వరాజ్యాన్ని సాధించి, దేశాన్ని సర్రైన పద్ధతులలో తీసుకుపోతున్నామనే విశ్వాసంతో వారిజీవితం సంపూర్ణమైనదనే నేను భావిస్తున్నాను

వారు కోరదగింది ఏమీలేదు వారికి భార్యగాని, పిల్లలుగాని, అటువంటి తాపత్రయం ఏమీలేదు ఆయనకు కావలసిందల్లా ప్రజాశ్రేయస్సే తన సర్వస్వాన్ని అర్పించిన మహావ్యక్తి కాబట్టే వారి జీవితం ధన్యమైనదనీ, సంపూర్ణమైనదనీ నేను భావిస్తున్నాను వారి ఆదర్శాన్ని, వారి జాతీయతను, మనముకూడ ఆదర్శంగా తీసుకొని, పెంపొందించుకొని, వారిమాదిరే దేశానికి సేవచెయ్యడానికి, శక్తిని, బలాన్ని సంపాదించగల్గుతామని ఆశిస్తున్నాను ఆదర్శంగా వారిని తీసుకుంటారని ఆశిస్తున్నాను

కావున ఈ తీర్మానాన్ని సభవారి ఎదుటపెట్టుతూ, దీనిని మనము ఏకగ్రీవంగా pass చెయ్యడమేగాక, ఈ నాటికి ఈ సభ వాయిదా వెయ్యాలనికూడ కోరుతున్నాను

**Mr Speaker** Resolution moved

శ్రీ పి సుందరయ్య (గన్నవరం) —అధ్యక్షా, భారతజాతీయ నాయకులలో ప్రముఖులైనటువంటివారు మౌలానాఆజాద్‌గారు నిన్నటినుంచీకూడా పత్రికలలో వార్తలు చూచినప్పుడు వారు చాలా ప్రమాద పరిస్థితిలో ఉన్నారని చెప్పినప్పుడు, ఆదుర్దాగా వారి పరిస్థితి ఏవిటో, ఎలాగుందోనని, Radio లో వినడానికి ప్రయత్నం చేస్తూ వచ్చాము ఉదయం రేడియోలో వారు చనిపోయినట్లు వినడం జరిగింది

ఇప్పుడు మీరు చెప్పిన తరువాత, సభానాయకులగు ముఖ్యమంత్రి చెప్పిన తరువాత వారి జీవిత విషయాలను గురించి ఎక్కువగా చెప్పవలసిన అవసరం లేదు జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో ప్రధాన పాత్ర వహించినటువంటి నాయకులలో వారొకరు ఈ రోజుకు కూడ మనం నెరవేర్చనటువంటి కర్తవ్యాన్ని వారు మన మీద వదలిపెట్టి వెళ్ళిపోయారు దానిని సాధించడానికి మనము కృతనిశ్చయులమై కార్య సాధనకు పూనుకోవలసినటువంటి అత్యవసరం వుందని విజ్ఞప్తి చేస్తున్నాను ఆయన జీవితాన్ని అంతా కూడ భారతజాతీయ స్వాతంత్ర్యము కొరకు, భారత జాతి అభివృద్ధి కొరకు, అర్పించారు మహాత్మాగాంధీతోపాటు హిందూ మహమ్మదీయుల ఐక్యత ప్రధానాంశంగా తీసుకుంటూ వచ్చారు

ఇప్పుడు ముఖ్యమంత్రిగారు చెప్పినట్లు మహమ్మదీయులలో అనేక మంది ఆయనను ద్రోహియని నిందిస్తున్నప్పటికీ కూడా హిందూ మహమ్మదీయ ఐక్యత అవసరం అనే దానిని గుర్తించి

ఒక రీత దీక్షతో పని చేశారు వారికి ఎన్ని కష్టాలు వచ్చినా, ఎన్ని తీవ్ర నిరసనలు వచ్చినప్పటికీ కూడా లక్ష్యం చేయకుండా దానికొరకు తన సర్వ శక్తిని వినియోగించడం జరిగింది అదంతా మనకు ఆదర్శప్రాయమైనది అంతే కాదు భారతదేశాన్ని సామ్రాజ్య వాదులు విభజించి పాకిస్తాన్ క్రింద విడగొట్టినప్పుడు కూడా ఎంతో బాధపడుతూ దానిని కొసవరకూ కూడా, వ్యతిరేకించిన ధీరుడాయన ఆ సిద్ధాంతాన్ని ఆయన తన జీవితాంతం వరకూ గూడా ఖండిస్తూ వచ్చారు ఈ రీతిగా మనదేశాన్ని రెండు ఖండాలుగా, రెండు దేశాలుగా విభజించడంవల్ల తిరిగి ఎప్పటికైనా సామ్రాజ్యవాదులు వేలు పెట్టేందుకు స్థావరం దొరుకుతుందని ఎంతో ఆందోళన పడుతూ వుండేవారు భారతదేశంలోని వివిధ కులాలు, మతాలు, ఐక్యంగా పని చేసినప్పుడే ముందుకు పోగలమనే సిద్ధాంతాన్ని వ్యక్తీకరిస్తూండేవారు కాశ్మీరుపై పాకిస్థాన్ సైన్యాలు దాడిచేసినప్పుడు దానికి వ్యతిరేకంగా భారత ప్రజానీకం కాశ్మీరు భారతావనిలో ఒక భాగంగా వుండాలని కోరడంజరిగింది దానివల్ల ఎన్ని కష్టాలు, నష్టాలు వచ్చినా భారత దేశముయొక్క ఐక్యతకు భంగం రాకుండా దేశాన్ని ముందుకు తీసుకపోవడం అవసరమని చెప్పిన నాయకులలో వారు ప్రథములని చెప్పవలసి వుంటుంది బ్రిటిష్ సామ్రాజ్య వాదుల కుట్రను దమననీతిని పటా పంచలు చేయడానికి హిందూ—ముస్లిం ఐక్యతే ప్రధానాంశమని వారు చెప్పారు పాకిస్థాను భారతదేశాలు వేరు వేరుగా ఉన్నా వాటిమధ్య స్నేహసంబంధాలుమరింత దృఢము కావాలని తదాశయ సిద్ధికోసము అహర్నిశలు కృషిచేసిన మహామహులు శ్రీ అబుల్ కలాం అజాద్

ఈ రోజు పాకిస్థాన్‌లో ఉన్న నాయకులు కొంతమంది భారతదేశంమీద కయ్యానికి కాలు దువ్వుతూండవచ్చు ఇంకా అనేక చిక్కులు కలిగిస్తూండవచ్చు ఈ విషయాలు మన జాతీయ నాయకులు, స్వతంత్రపోరాటంలో పాల్గొన్న అనేక మంది మనకు జ్ఞాపకము చేస్తున్నప్పటికీ, పాకిస్థాన్ మనకు పొరుగు రాజ్యమే భారత ఖండంలో ఒక భాగమే వేరువేరు పరిపాలనలు తప్పకున్నను, ఈరోజు అక్కడ వున్న నాయకులు స్వతంత్ర పోరాటానికి వ్యతిరేకంగా చాలాకాలంగా కృషిచేసినవారైనా, వారు చేసే ఆగడాలను మనము ప్రధానంగా పెట్టుకోకుండా అక్కడ ప్రజలతో దగ్గరి సంబంధాలు, స్నేహ సంబంధాలు పెట్టుకోవడమే భారతదేశంయొక్క విధానంగా వుండాలని రూపొందించిన నాయకులు అజాద్‌గారు వారి ఆశయ సాఫల్యతకోసం మనము కృషి చేయవలసి వుంటుంది భారతదేశములో ఎక్కువ మంది ముస్లిములు వున్నారు ఇక్కడ హిందూ ముస్లిముల ఐక్యతను మనము సాధించ వలసిన అవసరం ఎంతైనా యున్నది ముఖ్యంగా మెజారిటీ కమ్యూనిటీ అయినటువంటి హిందువులు, మైనారిటీ కమ్యూనిటీగాయున్న ముస్లిముల యొక్క భయాలనూ, ఆందోళనలను పోగొట్టేందుకు కృషి చేయవలసి యుంటుంది హైదరాబాదు సంస్థానంలో ఇత్తెహాదుల్ ముస్లిమీన్ తిరిగి హిందూ ముస్లిం దెబ్బలాటలు రెచ్చగొట్టేందుకు చేస్తున్న ప్రయత్నాలు గూడా మనము రోజూ ఆందోళనతో చూస్తున్నాము ముస్లింప్రజానీకానికి వున్న చిక్కులను, ఇబ్బందులను తొలగించి, కుల తత్వాలను రెచ్చగొట్టేవారికి మత ద్వేషాలను రెచ్చగొట్టేవారికి ఎలాంటి ఆస్కారం లేకుండా ఏ పార్టీకి చెందిన వారైనా సరే చెయ్యాలి భారతదేశంయొక్క ఐక్యతకు భారతదేశ ప్రజాతంత్ర పురోభివృద్ధికి తద్వారా పాకిస్థాను భారతదేశం రెండూగూడా మరింత సన్నిహితంగా, స్నేహ రాజ్యాలుగా వుండేటట్లు కృషి చేయాలి మనము అజాదుగారినుండి నేర్చుకోవలసింది హిందూ, ముస్లిం ఐక్యత ఒక్కటేకాదు హిందూ

మతంలో కూడా వివిధ కులాలు పలురకాలుగా తలెత్తుతూ వుంటవి ఇవి కూడ భారతదేశ అభివృద్ధికి ఐక్యతకు వినాశకరమైన పద్ధతిలో ఉన్నవే కులద్వేషాన్ని ఎదుర్కొనివ్వకుండా ప్రజాతంత్ర ఉద్యమాభివృద్ధికి అందరూ కలసికృషి చేసినప్పుడే ఆజాద్‌గారు మనమీద వదలి వెళ్ళిన కార్యాన్ని సాధించగలము ఈ సందర్భంలో ఇంతకు మించి చెప్పడానికి లేదు అందుచే భారత జాతీయ స్వాతంత్ర్యపోరాట నాయకులలో అగ్రగణ్యులున, ప్రఖ్యాతవిద్యావేత్త అయి నటువంటి శ్రీ అబుల్ కలాం ఆజాద్‌గారి మరణానికి మాపార్టీ తరఫున గూడా సానుభూతి తెలియజేస్తూ తీర్మానాన్ని మేము పూర్తిగా బలపరుస్తున్నాము

శ్రీ ఆర్ బి రామకృష్ణరాజు (వదమలపేట) —అధ్యక్షా, శ్రీ అబుల్ కలాం ఆజాద్‌గారు సార్థకనామధేయులు ఆజాద్ అనగా స్వేచ్ఛ స్వాతంత్ర్యము శ్రీ ఆజాద్‌గారు ఈదేశాన్ని తన మాతృదేశంగా చేసుకొని ఆ మాతృదేశ స్వాతంత్ర్యానికై తన యావత్ జీవితాన్ని ధారపోసి మనదేశ స్వాతంత్ర్యాన్ని సంపాదించి నేటిదినం ఈ ఐహిక సంబంధమైన దేహబంధాన్నివిడిచి శాశ్వత స్వేచ్ఛను పొందారు వారు కృతార్థులయ్యారు వారి జన్మతరించింది ఈనాడు మనము వారినిగురించి, వారువెళ్ళిపోయిన సందర్భాన్నిగురించి పరితపించవలసిన పనిలేదు ఎందువల్లనంటే వారు సార్థకనామకులు, కృతార్థులు వారి జీవితాన్ని దేశానికి అంకితము చేసినారు ఇప్పుడు మనలను గురించి మాత్రమే చింతించుకోవలసి వుంటుంది

వారి గుణగణాలను వర్ణించడానికి వారికంటె పెద్దలైన మీబోటివారికే తగును గాని మాబోటివారికి ఏ మాత్రమూ తగదు మాకు అర్హతకూడాలేదు మన భారతదేశ చరిత్ర ఇప్పుడుగాని, ఏ కాలంలోగాని, ఎవరుగాని చూచినప్పుడు అందులో దేశ స్వాతంత్ర్య సంపాదకుడు గాంధీగారికి సహాయభూతుడు, జవహర్‌లాల్‌కు సలహాదారుడు, శ్రీ ఆజాద్‌గారని గుర్తించగలరు కొన్ని కాంగ్రెస్ మహాసభలకు హాజరయ్యే భాగ్యంకూడా మాకు లభించింది ఆ కాంగ్రెస్ సభాకార్యక్రమాలలో ఎవరున్నా, ఎవరులేకపోయినా శ్రీ ఆజాద్‌గారు లేకుంటే గాంధీగారికి తృప్తిలేదు, సంతోషంలేదు శ్రీ ఆజాద్‌గారు ప్రక్కన కూర్చుంటేనే సభకు శోభ, గాంధీగారికి సంతోషం ఇంతవరకూ కంటిని రెప్పకాచినట్లు వారు మన దేశాన్ని కాపాడి ఈ దేశంలో వారు జన్మించకపోయినప్పటికీ ఈ దేశాన్ని తన మాతృదేశంగా చేసికొని, ఇచ్చట ఉన్నటువంటిగొప్పమత సంబంధమైన జాతులను రెంటినీ సమన్వయంజేసి మనదేశాన్ని సురక్షితంగా పాలించి మనకు అప్పగించి పోయారు పెద్దలంతా పోతున్నారు ఇక విశేషమైన సంఖ్యలేదు ఈ సందర్భంలో నెహ్రూగారి మనస్సు ఎలాపరితపించగలదో మనమూహించుకోగలము వారి అండనవున్న పెద్దవారంతా వెళ్ళిపోతున్నారు వారికి సహాయులెవరాయని దేశం నాలుగు చెరగులా అన్వేషించవలసిన సమయం వచ్చింది ఇంకా అంతా క్రమేణా పోగలరు ఎవరూ స్థిరంగా వుండేవారు లేరు అటువంటి మహాత్ములంతా వారుచేయవలసిన కార్యాన్ని నిర్వర్తించారు వారి కోరిక సఫలీకృతమైనది ఈ దేశాన్ని మన దేశంగాచేశారు మనచేతికి అప్పగించి పోయారు మనంగూడా పోయేవారమే ఆజాద్‌గారు నాకంటె రెండు సంవత్సరాలే పెద్ద కాబట్టి ఆ తరగతిలో చెందినవాడినే నేనుగూడ ఈ దేశాన్ని యిక సురక్షితంగా కాపాడవలసిన బాధ్యత, భారం వారిమీద పడిందనే విషయం మాత్రం నేను మన యువకులకు తెలియజేయ తలచుకొన్నాను కేవలం పెద్దవారు పోతున్నారని వారికి సానుభూతితెలపడం, వారిని గురించి చింతించడం కన్నీరు

కార్చడంకాదు మన కర్తవ్యం ఇకమీదట మనం చేయవలసిన కర్తవ్యం ఏమిటంటే — ఏవిధంగానైతే ఆ మహాపురుషులు అంతాచేరి మనదేశంయొక్క దాస్యాన్ని పారద్రోలి దేశం మనదని అనిపించి మనచేతికి అప్పగించి పోయారో, ఆ రీతిగానే మన సర్వస్వాన్ని ఒడ్డి దేశ పురోభివృద్ధిని సాధించాలి మేము బ్రతికి ఉన్నంతవరకూ ఈ దేశం మాది, చిరస్థాయిగా ఈ దేశం మనదని, ఈ దేశం యొక్క గౌరవాన్ని, ప్రతిష్ఠలను కాపాడవలసిన భారం మన యువకులమీద పడిందనీ, దానిని వారు గుర్తించాలని నేను కోరుతున్నాను

ఏ పార్టీకి చెందినవారైనాసరే ఈ నాడు తలెత్తుకొని తిరుగ గలుగుతున్నారంటే ఆ మహా మహులుచేసిన బ్రహ్మాండమైన త్యాగంవల్లనే నేటి దినము ఏ పార్టీయైనా స్వేచ్ఛగా మన గలుగుతున్నదంటే అది వారి కృషిఫలితంగానే కాబట్టి మన యువకులు, వారు ఏ మతానికి, కులానికి, పార్టీకి చెందినాసరే అందరూ కలసిమెలిసి ఆ మహామహులు చేసిన త్యాగాలను, ఇచ్చిన సందేశములను బాగా గుర్తుంచుకొని మనదేశం యొక్క గౌరవాన్ని, స్వేచ్ఛను కాపాడుదురుగాక యని భగవంతుని ప్రార్థిస్తూ యింతటితో నేను విరమిస్తున్నాను

శ్రీ పి నరసింగరావు (హుజూరాబాద్—జనరల్) —అధ్యక్షా, ముఖ్యమంత్రిగారు ప్రవేశ పెట్టిన తీర్మానాన్ని నేను, నా పార్టీవారు బలపరుస్తూ యీ సందర్భములో కీ శే మౌలానా ఆజాద్‌గారిని గురించి రెండు మాటలు చెప్పదలచుకున్నాను మనదేశ జాతీయ నాయకులలో అందరికన్న యెక్కువ కాలము కాంగ్రెసుకు అధ్యక్షుడుగా వున్న గౌరవము యీ ఒక్క ఆజాద్ గారికే దక్కిందని చెప్పవచ్చు అంతేకాకుండా మనదేశ చరిత్రలో ముఖ్య ఘట్టాలలో ఒకటి అయిన "క్రిప్స మిషన్" 1942వ సంవత్సరములో వచ్చినప్పుడు కూడ అధ్యక్షులుగా ఆజాద్ గారే వుండడము, మరియు కాబినెట్ మిషన్ వచ్చినప్పుడు కూడ ఆజాద్‌గారే 1946 లో అధ్యక్షులు గావుండడము జరిగినది Cabinet Mission వచ్చినప్పుడు వార్ధాలో 4, 5 రోజులు Congress Working Committee సమావేశము జరిగివుండెను అప్పుడు నేను విద్యార్థి కాంగ్రెసులో ఒక వాలంటీరుగా వుంటూ ఆజాద్‌గారికి—యితరులకు సేవచేసే అదృష్టము, లభించింది వారికి సన్నిహితముగావుండి వారిని చూడడము, వారి ఉపన్యాసాలువినడము కూడ తటస్థించింది అటువంటివారు యీ రోజు మననుంచి, మనదేశమునుంచి దూరమై పోయి నారు వారు ముఖ్యముగా మతానికి, జాతీయతకు వైరుధ్యంలేదన్న సిద్ధాంతాన్ని ఋజువు పరచినారు వారుకట్టు జాతీయవాది కాకుండా, కట్టరి మతవాదిగా కాకుండాగా వుండిరి వారు కొరాన్‌పై వ్రాసిన Comentary ఉత్కృష్ట గ్రంధములలో ఒక్కటిగా పరి గణింపబడుచున్నది అంతేకాదు వారికి ఉర్దూ సాహిత్యములో విశేషపాండిత్యం ఉండెడిది పార్సీ మరియు అరబ్బీబాషలలో ప్రావీణ్యాలు ఆయన యే ఆదర్శాలైతే మనకు విడిచిపెట్టి వెళ్ళి నారో ఆ ఆదర్శాలను మనము నిలబెట్టుకొనడానికి సంపూర్ణముగా ప్రయత్నిస్తామని శపథముచేస్తూ మరొకసారి ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన తీర్మానాన్ని బలపరస్తూ విరమించు కొంటున్నాను

*శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) —అధ్యక్షా, తెల్లవారేసరికి ఈ ఘోర మరణవార్త మనకు వినబడింది ఎవరైతే పెద్దలుగా వుండి జాతీయోద్యమములో మనలనందరిని

ఉద్రూతలూగించడానికి మూలపురుషులో అట్టివారు ఒక్కొక్కరే దివంగతలౌతున్న సంగతి వింటుంటే మన మనసులు కృంగి పోతున్నవి భవిష్యత్ ఎలా వుంటుందన్న భయము కూడా వేస్తున్నది ఐతే రామకృష్ణరాజుగారు చెప్పినట్టుగా ఎవరూ శాశ్వతముగా వుండరు కాని వారు చేసిన సేవ, వారు చేసిన త్యాగము నిలుస్తుంది వారు చూపిన ఆదర్శాలనుబట్టి మనం నడుచుకొనకపోయినట్లయితే ఏ విధముగా దేశము ముందుకు పోగలదన్న సంకోచము కలుగుచున్నది శ్రీ రామకృష్ణరాజుగారు అన్నట్లుగా వారందరు ముందు తరమువారు మేము తరువాత తరములోనివారము వారు నిజాయితీతో, నిష్కల్మషమైన దేశభక్తితో మనకు ఇచ్చినటువంటి "ఆజాద్ భారతము" నిలుస్తుందా అనే అనుమానం వేస్తున్నది వారు దేశభక్తితోటి పునాదులు వేశారు దానిని నిలుపుకోవడానికి మనంకూడా నిర్భయంగా ముందడుగు వేయవలసిన అవసరమున్నదని చెప్పుతున్నాను వారిలో రెండవ విశేషమేమంటే వారు ఇంగ్లీషులో పెద్ద పాండిత్యం కలవారు కారు కాని ఇతర భాషలలో అపార విజ్ఞానాన్ని సముపార్జించిన మహాత్తరమైన యోధులు దేశములో క్లిష్ట సమస్యలు వచ్చినప్పుడు వారికి ఇంగ్లీషు వచ్చునా రాదా అనే సమస్య వచ్చినప్పుడు కూడ అవన్నీ లేకుండా అన్ని సమస్యలు సమగ్రంగా పరిష్కరించే ఒక ఆదర్శ మూర్తి ఇంగ్లీషు నేర్చుకుంటేనేగాని ఇక ప్రపంచాన్ని నడపలేమన్న ఆపోహకు వారు సరియైన సమాధానములు యిచ్చినారు వారు ఇంగ్లీషు ప్రభుత్వమునకు డిక్టేటు చేసి దేశమును ఏ విధముగా నడపగలిగినారో మనం చూచినాము మూడవ విషయం ఏమంటే మన దేశములో వారు మత కుల భేదాలను పాటించకుండా దేశభక్తికలిగి వుండిరి మతానికి, రాజకీయాలకు సంబంధం లేదని చెప్పినటువంటి మహానుభావుడు శ్రీ మౌలానా ఆజాద్ మత విషయములో బహుశా: ఆయన తిన్న చీవాట్లు ఇంకొకరు పడలేదు కాంగ్రెసు ఖచ్చితముగా "ఆజాద్ మా మనిషి ఆయన లేనిదే కాంగ్రెసు లేదని" చెప్పింది ఆ జాతీయ ఆశయము కోసము, మతాతీతమైన భారతరాజ్యాంగ నిర్ణయానికి ఆ రోజున పునాదులు వేసిన సంగతిని మనమందరము జ్ఞాపకముంచుకొనవలసినదే —అదే ఆదర్శముగా వుండాలి మతానికి రాజకీయ ప్రసక్తి లేదని ఆయన విశ్వాసము మతాతీతమైనటువంటి రాజ్యాంగం ఏర్పడాలని కృషిచేసినటువంటి అయోధుడు మనకందరకు ఆదర్శప్రాయుడు వారి పరిచయ భాగ్యము నాకొకసారి లభించింది ఆంధ్ర రాష్ట్రము సాధించే విషయంలో 1949వ సంవత్సరములో ఒక డిప్యుటేషన్‌గా ఢిల్లీ వెళ్ళాము ఆ Deputation లో అయిదుగురము వున్నాము ఆంధ్రరాష్ట్రము కావాలని మేము కోరినాము దానికి కావలసిన ప్రయత్నములన్నియు చేసి వీలైతే 1950 Constitution లో ఆంధ్రరాష్ట్రము ఇప్పించేందుకు ప్రతి ప్రయత్నము చేస్తామని హామీ ఇచ్చినారు ఆనాడు కాకపోయినా తరువాత వారు పూర్తిగా కృషి చేసినారు అంతేకాకుండా—మన పెద్దలందరకు తెలుసు —విశాలాంధ్ర సాధించే విషయములో కూడ వారు మనకుపూర్తిగా సహకరించినారు అందువలన విశాలాంధ్ర కూడ కుల మతాతీతమైనటువంటి రాష్ట్రముగా వుండాలనే దానికి మనము ఆ మహానుభావుని ఆదర్శముగా పెట్టుకొని నడుపుకొనవలసిన బాధ్యత మనపై గలదు ఆయన జైలులోవున్నప్పుడు ఆయన భార్యా వియోగము తెలిసినా గాని ఆయన మాత్రము ఖేదపడలేదు —అంతటి దృఢస్థితప్రజ్ఞుడు ఆయనేనని చెప్పవలసివుంటుంది అందువల్ల మనకు ఎన్ని కష్టాలువున్నా, మన బంధువర్గముగాని, మన మతముగాని, కులముగాని మనల్ని Vilify చేసి పారేస్తున్నప్పటికీ అంతకన్న, వున్నత ఆశయానికి ఆదర్శాలకు మనం ఆయత్తులం కావలసి వున్నది అందుకు నిజాయితీ

దేశభక్తి అపార ప్రజాసేవ తృష్ణ కావాలి వాటితోటి ముందుకు నడచి పోవటానికి ఆ మహానుభావుని ఆదర్శముగా వుంచుకొనడానికి ప్రయత్నం చేద్దామన్న ప్రతిజ్ఞ చేస్తూ నా తరఫున, నా మిత్రులైనటువంటి ఇతర స్వతంత్ర సభ్యుల తరఫున నేను ఈ తీర్మానాన్ని బలపరుస్తున్నాను.

శ్రీ షేక్ మౌలాసాహెబ్ (ఉదయగిరి) —అధ్యక్ష మహాశయా! ఈనాడు ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన తీర్మానాన్ని నేను బలపరుస్తున్నాను గాని యీనాడు ఆజాద్ గారి మరణవార్త వినగానే యావత్తును హిందూ దేశములోనేకాదు ప్రపంచములో వున్నటువంటి మైనారిటీలందరు దుఃఖించవలసినదే దుఃఖసముద్రములో యున్నారు ఆయన ఒక్క హిందువులు, మహమ్మదీయులకేకాదు ప్రపంచంలోగల మైనారిటీలకు యితరులకు ఆయన ఒక మార్గ దర్శకుడు నిజముగా హిందూ ముస్లిం మతాలకేకాదు వారు నాయకత్వం వహించింది దేశ ఐకమత్యము మానవత్వము అనే 'ఇన్సానియత్' ను గురించి బోధించినారు అదే అహింసా విధానము మహాత్మాగాంధీ అనుచరులుగా వారు తయారై నిజముగా వారు మైనారిటీలచేత అనేక దూషణలు పడినారు ఎటువంటి కష్టాలువచ్చినాకూడ వారు లెక్కచేయకుండా ఆ మానవత్వమనే 'ఇన్సానియత్'ను గురించి బోధించినారు మతము, కులం అనే రంగు చొక్కాలు విడనాడి, మీరంతా మనుష్యజాతికి చెందినారని ఆరకంగా మెలగవలసినదని ఆయనచెప్పినారు హిందూ దేశములో మనమందరము అన్నదమ్ములం ఈ దేశములోనే జన్మించినాము మన జన్మభూమి ఈ దేశమే మనమంతా యితర దేశాలనుంచి యిక్కడకురాలేదు మనది నల్ల శరీరము తెల్లశరీరముకాదు తెల్లవాళ్లంకాము అనిగుర్తింపజేసి శ్రద్ధతో మనకు బోధించారు. మనం మసీదులో ఏరకంగా ప్రార్థనజరిపెదమో ఆ విధముగానె సర్వకాల సర్వావస్థల యందు సర్వ జన సంపన్న సేవా తత్పరులై వుండవలసిందని చెప్పినారు అటువంటి మహానుభావుడు నేడు మన హిందూ దేశములోనుంచి మనలను విడిచి దివంగతులైనారు మనలనువదలి ఆ దేవునిలో ఐక్యమైనందుకు మా సంతాపమును తెలుపుతున్నాము వారు పవిత్రమైన శుక్రవారం రోజున మరణించడం, అందులో దైవానుభూతమైన తెల్లవారుఝామున, ఉదయం నమాజ్‌వేళన మరణించిన గౌరవము ఆయనకే దక్కినది ఇట్టి పవిత్ర మరణమే స్వర్గము వారి మరణమును గురించి వారి కుటుంబానికి నా సానుభూతి సంతాపమును తెలుపుతున్నాను అబుల్ కలాం ఆజాద్‌గారు మహాత్మా గాంధీగారి యొక్క, పండిత జవహర్‌లాల్ యొక్క సహచరులు స్వాతంత్ర్యసమర కాలంలో దేశ ఐక్యతకు ఎంతో కృషిచేశారు దేశంలోనే అల్పసంఖ్యాక వర్గమువారు ఏవిధముగా ఉండవలెను అనే విషయము ఆచరించి చూపించారు దేశ స్వాతంత్ర్యాన్ని సంపాదించినవారు అపారమైన సేవచేశారు దేశంలోని వివిధ మతస్థులలో సామైక్యతా భావము వర్ధిల్లాలని వారు ఎప్పుడూచెప్పుతూ ఉండేవారు వారి వాక్యములను బోధనలను అల్పసంఖ్యాక వర్గమువారు ఎప్పుడూ చూచుకుంటూ ఉండాలి ఈనాడు మనకువారులేరు ఐనప్పటికీ వారి బోధనలు మనమెన్నడూ మరువరాదు దేశ ఐక్యతకు భంగము వాటిల్లే పని ఏదీ చేయరాదు వారి ఆశయాలను మనము సర్వదా దృష్టిలో ఉంచుకొని వారు మనకు చూపించిన మార్గాన్ని అనుసరించాలి శ్రీ ఆజాద్‌గారు మహా విద్వాంసులు ఇస్లాం మత గ్రంథాలకు వారిచ్చిన అనువాదములు అపూర్వమైనవి ఎవరు ఏ మతానికి చెందినప్పటికి కూడా మనమందరము ఒకే దేశమువారము అనే భావాన్నివారు మనకు బోధించారు. మత

మనెడిది వ్యక్తికి సంబంధించినది ఎవరు ఏ మతము వారైనప్పటికీ సాంఘిక జీవనవంలో ఎటి విద్వేషాలు ఉండరాదని వారుచెప్పేవారు అటువంటి మహాత్ములు గతించినందువల్ల మా హృదయాలు తరుగుకొని పోతున్నాయి మైనారిటీ కమ్యూనిటీ అయిన ముస్లిమ శ్రీ మౌలానా అబుల్ కలాం ఆజాద్‌గారు సూచించిన మార్గాన్ని అనుసరించవలెనని కోరుతున్నాన ఆ మహా మహానికి భగవంతుడు స్వర్గమును ప్రసాదించుగాక అని ప్రార్థిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను

سری جے۔ بی۔ مسال راو — (گجویل—محفوط) مسٹر اسپیکر سر۔ آج ہاوز کے سامنے چیف مسٹر صاحب نے جو رزولیوشن پیش کیا ہے اوس کی تائید کرتے ہوئے مولانا صاحب کے بارے میں دو چار شدہ کہنا چاہتا ہوں۔ سب سے پہلے میں بھگوان سے پرارتھنا کرتا ہوں اور اون کے کنبہ کے لیے دل سے شردھانجلی ارپت کرتا ہوں۔ انہوں نے ہندوستان کے لیے جو خدمات انجام دی ہیں اس کو کوئی بھی بھارت کا نواسی بھلا نہیں سکتا۔ در اصل وہ مکہ سے آئے تا کہیں سے آئے لیکن وہ بھارت ماتا کے سچے سپوت رہے۔ انہوں نے بھارت ماتا کی آزادی کی جنگ میں مہاتما جی کا ساتھ دیکر، خاص طور سے پنڈت جی کے ساتھ متحد ہوکر آزادی کی لڑائی لڑی اور ہم بھارت میں بسنے والوں کو آزاد کرایا۔ وہ زندہ رہے تو بھارت ورش کے لیے زندہ رہے اور میں سمجھتا ہوں کہ مرے بھی ہیں تو بھارت ورش کی خدمات انجام دیتے ہوئے مرے ہیں۔ انہوں نے یہاں کے لوگوں کو ایک سیق دیا ہے اور وہ سبق یہ ہے کہ ہماری ایک ڈیموکریٹک کنٹری (Democratic country) ہے ہم دنیا میں زعم کرتے ہیں کہ ہمارا ملک ایک سیکولر اسٹیٹ (Secular State) ہے۔ ہندوستان کے تمام لوگ سچے ہندوستانی ناگرک ہیں۔ مولانا نے ہمیں جو سبق دیا ہے ہندوؤں اور مسلمانوں کو (خاص طور سے مسلمانوں کو) کہ ہندوستان میں جو لوگ بستے ہیں انہیں ہندوستانی بنکر بسنا چاہیے۔ جیسا کہ چیف مسٹر صاحب نے اس ہاوز میں فرمایا کہ مسلمان لوگ (حیدرآباد میں کیا اور آندھرا پردیش میں کیا) عجیب طریقے سے مسائل پیش کر رہے ہیں۔ ان تمام بھائیوں سے میری پرارتھنا ہے کہ اگر ان مہان لوگوں کی آتما کو شانتی پہنچاسکتے ہیں تو وہ اس طریقہ سے کہ اس وقت ہم میں جو شکی ہے اوس سے دوشٹ پرچار سے ہٹ کر ہندوستان کی ایکتا کے لیے کام کرنا چاہیے۔

میں سمجھتا ہوں کہ مولانا کی وفات سے ہندوستان بھر میں اتنا دکھ کسی کو نہیں پہنچا ہے جتنا کہ پنڈت جی کو پہنچا ہے۔ کیوں کہ گاندھی جی کے بعد مولانا ہی پنڈت جی کا سیدھا ہاتھ تھے۔ کسی مسئلہ میں مولانا صاحب سے کنسلٹ (Consu't) کیے بغیر وہ اقدام نہیں لیتے تھے۔ اس لیے پنڈت جی کے ہاتھوں کو مضبوط کرنے کے لیے مولانا صاحب کا آدیش پالن کرنا چاہیے۔ وہ ہندوستان کے سچے نر اور بھگت تھے اور حیدرآباد کے لوگوں کا خاص خیال رکھتے تھے۔ پنڈت جی کے بعد مولانا ہی کو تلنگانہ کے لوگ کہیے یا آندھرا پردیش میں بسنے والے کہیے ان کا انہیں بڑا خیال تھا۔ وشال آندھرا یا تلنگانہ کے مسئلہ میں ان کے وچار چاہے کچھ ہی ہوں لیکن تلنگانہ یا حیدرآباد کے لوگوں

کے رائٹس (حقوق) کے لیے کوئی لڑنے والا تھا تو وہ مولانا صاحب ہی تھے۔ ہم تمام بھائی جو بھی جای اور ستی رکھتے ہوں مولانا نے جوکچھ بھی بتلایا ہے اس کا پالن کریں تو مجھے پوری امید ہے کہ ہمارا ملک سکھ اور شانتی کے ساتھ رہ سکتا ہے۔ جب مسٹر صاحب نے جو ریزولیوشن ہاؤس کے سامنے رکھا ہے اس کی تائید کرتے ہوئے میں اپنی طرف سے شردھان جلی ارپت کرتا ہوں۔

[Sri Mahboob Ali Khan (Kurnool)] — * شری محبوب علی خان (کرنول)
محترم صدر صاحب ! آج ایوان میں ایک غم کی لہر دوڑ گئی ہے کیوں کہ مولانا ابوالکلام آزاد موت کو لبیک کہتے ہوئے اس دنیا سے سدھارے ہیں ۔ آپ کو پتہ ہے کہ اوس مبارک سرزمین پر جس کی طرف ہم سب مسلمان سربسجود ہوتے ہیں وہاں مولانا کا جنم ہوا اور انہوں نے وہیں تعلیم حاصل کی۔ ان کے والدین نے ان کا نام ابوالکلام آزاد رکھا ۔ ابوالکلام کے معنے علم کا باپ ہیں اور میں سمجھتا ہوں کہ ساری دنیا کے علم میں ان کا کوئی ثانی نہ تھا ۔ اس ہندوستان میں جس میں ہم سب بستے ہیں، مسلم لیگ کا دور آیا تو اوس زمانہ میں مولانا نے مسلم لیگ کے لیڈروں کو ہدایت کی۔ مگر مسلم لیگ کچھ اندھا دھند رفتار سے چل رہی تھی اس لیے نہ صرف ان کی ہدایت کو نظر انداز کیا گیا بلکہ اس کے ساتھ ساتھ ان پر غیر غلط باتوں کی بوچھار کی گئی ، جس سے ان کا جگر چھلنی ہو گیا ۔ لیکن اس کے باوجود بھی انہوں نے اس کا برا نہ مانا اور سیاسی طور پر انصاف کی ڈور کو اپنے ہاتھ سے نہ چھوڑا ۔ انہوں نے ہندوستان میں اتفاق و اتحاد کی تعلیم دی اور بہت ساری کتابیں جو انہوں نے لکھی ہیں ان میں اتفاق و اتحاد پر زور دیا ہے ۔ بلکہ کہنا چاہیے کہ ان کے سارے علم کا نچوڑ اتفاق و اتحاد کی تعلیم ہے ۔ ایک زمانہ میں وہ کلکتہ کی بڑی مسجد میں امامت کرتے تھے ۔ اس وقت انہوں نے لاکھوں لوگوں کی امامت کی ۔ مگر ایک وقت آیا کہ سارے مسلمانوں نے انہیں غیر غلط کہا ۔ کلکتہ میں وہ ایک وقت نماز کے لیے مسجد میں تشریف لے گئے تو کسی نے بھی ان کو امامت کے لیے جگہ نہیں دی آخرکار وہ سب سے پچھلی صف میں نماز ادا کرکے چلے گئے ۔ مگر انہوں نے اس بات کا کوئی خیال نہیں کیا کہ انہیں جگہ نہیں دی گئی۔ وہ اتفاق و اتحاد کے حامی تھے اور کسی کو برا نہ کہنا چاہتے تھے ۔ اس لیے ہمارے تمام بھائیوں سے میں یہ گزارش کرونگا کہ ہم ان کے دئے ہوئے سبق کو سیکھیں اور اتفاق و اتحاد کو اپنے ہاتھ سے جانے نہ دیں ۔ وہ علم کے باپ تھے ۔ افسوس ہے کہ آج علم کا یہ چراغ دنیا سے گل ہو گیا ہے ۔ مگر جو نصیحتیں انہوں نے ہمارے لیے چھوڑی ہیں ہم اس پر عمل پیرا رہیں اور سبق سیکھیں ۔

ہمارے وزیر اعلیٰ نے جو ریزولیوشن پیش کیا ہے میں اس کی تائید کرتا ہوں۔ خدائے تعالیٰ مولانا ابوالکلام آزاد کی روح کو جوار رحمت میں جگہ دے اور ان کے پسماندگان اور عزیز و اقارب کو صبر جمیل عطا فرمائے ۔ میں چاہتا ہوں کہ ریزولیوشن میں اس کا اضافہ کیا جائے ۔

**Smt Masooma Begum* (*Pathergatti*) I rise to support the condolence resolution and fully reciprocate the feelings expressed by the Chief Minister and other leaders of the parties in the House regarding the irreparable loss to the nation caused by the death of a great stalwart of India, Moulana Abul Kalam Azad, a strong believer in the high ideals of life which he followed so scrupulously, and an unassuming worker who never craved for the lime-light He was often misjudged and criticised by his own people, but nothing shook his faith and he followed his principles with undaunted courage He was more of a scholar than a politician, and his contribution to the literary world has been great, especially his commentary on the Quran As a speaker also, he left his audience spell bound In short, his life was one of dedication to duty and service of his country

May I, Sir, on behalf of the ladies, ask you to convey our heart felt condolences to the family of the bereaved ? May God give his soul peace !

శ్రీ పి వెంకటసుబ్బయ్య (రాజంపేట—రిజర్వుడు) —అధ్యక్షా, ఒక పద్యం చదవుతాను

శోకపరితప్త హృదయంబు శూన్యభావ
విలసితంబయ్యె, ఆజాదు పృథివి
వీడి చనెనన్న వార్త వినిన సమయమందు
వారి ఆదర్శ జీవిత సారమెల్ల
గ్రహణమును చేసి బ్రతుకును కనుదమింక ||

శ్రీ సి పి తిమ్మారెడ్డి (సిరిపెల్) —అధ్యక్షా, ఈ దినం చాలా విషాదకరమైనటువంటిది శ్రీ అబుల్ కలాం అజాద్ వంటి మహాపురుషులు మనకు లేకపోవటం పెద్ద లోటు అనుభవజ్ఞులైనటువంటివారు మన దేశ సారధ్యమునకు అత్యవసరం మన దేశములో, మరణించినవారిని రెండు రకములుగా చెప్పుకుంటారు,—కొందరిని చనిపోవటమంటారు, కొందరిని నిర్యాణము చెందారంటారు మహాపురుషులు భౌతిక శరీరాన్ని వదిలితే నిర్యాణ మంటారు సామాన్యుడు భౌతిక శరీరాన్ని వదలితే—మరణం అంటారు అజాద్‌గారు మహాపురుషులు కాబట్టి నిర్యాణమనే చెప్పబడుతుంది నిర్యాణమంటే చావటం కాదు వారు భౌతిక శరీరాన్ని వదలిన తరువాత కూడా వారి ఆత్మ అందరి ఆత్మల్లో ప్రవేశించి సర్వ వ్యాపకమువులుంది కాబట్టి దానికి నిర్యాణమని చెప్పబడుతుంది కారణజన్ములైనటువంటి వారు మహాపురుషులు, ఒక కార్యార్థమై ప్రపంచము లోకి వచ్చి దానిని నిర్వర్తించిన తరువాత వెళ్ళిపోతూవుంటారు అట్లాగే భారతయుద్ధం ముందు కూడ శ్రీకృష్ణ భగవానుడు పుట్టాడు, భారతయుద్ధం అయిపోగానే భౌతికదేహం వదలి వెళ్ళి

జాయారు వారు జన్మించిన కాలములో వారి సహాయార్థమై మిగతాదేవతలుకూడ పుట్టారు అన్లానే మహాత్ముడు పుట్టిన రోజులలో, దేశ స్వాతంత్ర్య సంపాదనార్థమై వారి వెంట కొందరు మహాపురుషులను కూడ తీసుకు వచ్చారు స్వాతంత్ర్యాన్ని సాధించారు ఒక్కొక్కరు ఒక్కొక్క మహాకార్యం కోసం జన్మ ఎత్తారు వారు ఆ కార్యమును సాధించగానే వెళ్ళి పోతా ఉంటారు వారు ఎందుకోసం ఈ భూలోకానికి వచ్చారో, వారు చేయవలసిన పని ఏమిటో, తిరిగి వారు ఎక్కడికి వెళ్ళుతున్నారో—సర్వస్వమూ తెలిసినటువంటి మహాజ్ఞానులు అటువంటి మహాపురుషులగురించి మనము తర్కించడము గాని, ఎక్కడినుంచి వచ్చారు, ఎక్కడికి వెళ్ళి వుంటారు అనేది ఊహించటము కాని కష్టం మనకు శక్తి లేనటువంటి విషయం వారు కారణజన్ములు కాబట్టి మహా పదవినే చెంది వుంటారు అటువంటి మహాపురుషుని గురించి స్మరించుచు నాకు కూడ అవకాశమిచ్చినందుకు తమకు కృతజ్ఞత తెలుపుతూ, మనకు కలిగిన విషాదమునకు చింతిస్తూ, ఈ తీర్మానమును బలపరుస్తున్నాను

*The Minister for Co-operation & Housing (Sri Mehdi Nawaz Jung)* Mr Speaker, Sir, In obedience to your wishes, I stand to speak I feel that the moving of the Resolution by the Leader of the House, the Chief Minister, was quite enough and I was a party to the said resolution However, respecting your command I just say a few words

Maulana Azad was a very great man, a great thinker, a thinker in practical ways His judgment was very sound and he was a real architect in the sense of our national freedom Whether now or before, at the time of Gandhiji and as a companion and lieutenant of Panditji, he had always been a faithful adviser and had been a source of great help

As I said to the pressmen this morning, everyone will die some day leaving a good name and some, otherwise Maulana has left behind examples of courage, conviction and character Instead of mourning momentarily for his death, it is better that we always bear in mind his example and live up to the ideals that he lived for

I would like to tell you, Sir, in this connection a personal matter When I was offered Ministership in the erstwhile Hyderabad Government, some Muslims came to tell me that I represent them I told them ' I represent all my people , I represent justice, I represent humanity, I cannot belong to any sect to represent it ' But they said that Maulana said that ' you are the representative of the Musalmans ' I said 'I will ask him' I told Maulana what people told me He said ' They were quite wrong You are perfectly right That is how you should work '.

Maulana was really a great man and the best way of mourning his death is to live according to the ways, the policies and manners he left  He has left a very great mark behind

శ్రీ ఈగూరు చిన్నప్ప (మహబూబ్‌నగర్) —అధ్యక్షా, నేటి మౌలానా అబుల్ కలాం ఆజాద్‌గారి నిర్యాణంవల్ల దేశానికు చాలా నష్టము కలిగినది  ముఖ్యంగా మన స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నటువంటి ముఖ్యులలో వారు ఒకరు  ద్విజాతి సిద్ధాంతాన్ని ఎదిరించినటువంటి మహమ్మదీయ అగ్రగణ్యులలో అగ్రగణ్యులైన వారు, శ్రీ మౌలానా అబుల్ కలాం ఆజాద్‌గారు వారు ద్విజాతి సిద్ధాంతాన్ని ఎదిరించి పోరాడిన ఫలితముగా, నేడు మనము యీ ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని నెలకొల్పుకొనే అవకాశము కలిగినది  ముఖ్యంగా స్థితప్రజ్ఞులు ఉనతగ్గ వారిలో గాంధీ మహాత్ముడు, వినోబాభావే, మౌలానా అబుల్ కలాం ఆజాద్‌గార్లు గలరు  ఆజాద్‌గారు గాంధీ మహాత్మునకు అనుచరులుగా ఉండి, వారి కుడిభుజముగా పనిచేసినారు  ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్, సరిహద్దు గాంధీ తరువాత మౌలానా అబుల్‌కలాం ఆజాద్‌గారు మన దేశము కొరకు పాటుపడి, నాటినుండి నేటివరకు అన్ని రంగాలలో, అగ్రనాయకులతో పాటు దేశానికి సేవ చేశారు  అటువంటి మౌలానా అబుల్ కలాం ఆజాద్‌గారు నేడు పరమపదించినందుకు చాలా విచారపడుతూ, వారి ఆత్మకు శాంతి కలగాలని నేను దైవాన్ని ప్రార్థిస్తూ, వారి కటుంబానికి సానుభూతి తెలుపుతున్నాను

మిస్టర్ స్పీకర్ —ముఖ్య మంత్రిగారు ప్రతిపాదించిన తీర్మానముపై చాలామంది సభ్యులు మాట్లాడినారు  అబుల్‌కలాం ఆజాద్‌గారి యొక్క స్థానము ఎవరూ పుచ్చుకోవటానికి వీల్లేనటువంటిది  1906 వ సంవత్సరమునుండి, స్వరాజ్య శంఖారావం కాంగ్రెసు పూరించినప్పటినుండి, బ్రిటీషు సామ్రాజ్యవాదులు మనలో మతము కులము అను భేదములు రెచ్చగొట్టి, మనకు స్వాతంత్ర్యము రాకుండా చేయటానికి విశ్వప్రయత్నము చేశారు  అప్పటినుండి మౌలానా అబుల్ కలాం ఆజాద్ యీ కమ్యూనలిజమ్ మతపిచ్చను ఎదుర్కొన్నాడు  1906 వ సంవత్సరపు సంగతి మనకు తెలుసును  డక్కా నవాబు సలీముల్లా పెద్ద ఉద్యమము తీసుకువచ్చారు  అప్పుడు రక్తప్రవాహములైనవి  ప్రతిచోటా కమ్యూనల్‌రైట్స్ జరిగాయి  మనము స్వరాజ్యముగట్టిగా అడిగినప్పుడల్లా కమ్యూనల్‌రైట్స్ జరిగినవి  ఈ కమ్యూనలిజాన్ని ఎదుర్కొన్న వారు శ్రీ అబుల్ కలాం ఆజాద్

డాక్టర్ అన్సారీ, హకీం అజమల్‌ఖాన్, ఖిద్వాయ్ మొదలగు పెద్దలంతా పోయినారు ఆఖరుకు నేడు, ఆజాద్‌గారు కూడ పోయినారు  మౌలానా అబుల్‌కలాం ఆజాద్‌గారు గొప్ప జాతీయవాదులు, స్వాతంత్ర్యప్రియులు  వారికి మతము అన్నది ఒక ధర్మముగాని, ఒక సెక్ట్ కాదు  మహాత్మాగాంధీ భగవద్గీత వ్రాశారు  మహాత్మాగాంధీ హిందువులకు ప్రతినిధికాడు అట్లాగే అబుల్‌కలాం ఆజాద్ ఖురాన్ వ్రాశారు  అబుల్ కలాం ఆజాద్ మహమ్మదీయుల ప్రతినిధికాడు  డాక్టర్ సన్‌యట్‌సేన్ గొప్ప క్రిస్టియన్  కాని, ఆయన క్రిస్టియన్ల యొక్క ప్రతినిధికాడు  ఈ జాతీయ వాదులు, స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొన్న నాయకులు కులాలను మతాలను ఎదిరించినటువంటి వారు  కులాలకు, మతాలకు అతీతులు వారు  తమ జీవితాలను పవిత్రము చేసుకొనుటకు వారు మతమును వినియోగించుకొన్నారు  వారు గొప్ప ఉద్యమాలలో

పనిచేసినారు వారు ధర్మ్యాలు కావటానికి మతము అన్నదానిని మార్గముగా చేసుకొన్నారు "మతము మానవ స్వాతంత్ర్యమునకు, మానవ సమానత్వమునకు, సోదరత్వానికి అడ్డము వచ్చేది కాదు మతము దేశీయ ఐక్యతకు అడ్డము వచ్చేదికాదు" అనే మాట వారు చెప్పారు 1921 వ సంవత్సరంనుండి నాకు వారితో పరిచయము కలిగే అదృష్టము కలిగింది వారితో చాలా పరిచయముగా చనువుగా మాట్లాడే అవకాశము నాకు కలిగింది అది నా అదృష్టము మొదట, బెజవాడలో ఆల్ ఇండియా కాంగ్రెసు కమిటీ జరిగినపుడు, మహాత్మాగాంధీతో పాటు అబుల్ కలాం అజాద్‌గారు వచ్చారు డాక్టర్ అన్సారీ, హకీం అజమల్‌ఖాన్, మహమ్మదాలీ, షౌకత్ ఆలీ మొదలైనవారంతా వచ్చారు ఆజాద్‌గారు 1923 లో స్పెషల్ కాంగ్రెసుకు అధ్యక్షత వహించారు 'నో ఛేంజ్' కున్నూ, స్వరాజ్య పార్టీ వాళ్ళు వారు రాజీనామా కదిర్చారు మన ఆంధ్ర కాంగ్రెసు కమిటీ తరఫున నేను, ప్రకాశంగారు వెళ్ళి, దాసుగారికి ఆజాద్‌గారికి మద్దతు ఇచ్చాము అప్పటినుండి నేను అనేకసార్లు అజాద్‌గారి దగ్గరకు వెళ్ళటము, వారితో మాట్లాడటము వారిదగ్గర కూర్చోవటము, అనేక సంగతులు తెలుసుకోవటము జరిగింది అటువంటి అదృష్టము నాకు కలిగింది "I am a caste less Hindu" అని మహాత్మా గాంధీ చెప్పారు, ఏసుక్రీస్తు బోధనలగురించి ఆయన "నిజమైన భగవద్గీత, నిజమైన ఉపనిషత్ ధర్మాలు, ఖురాన్" అని వ్రాశారు అవి మానవులను పునీతం చేసేటటువంటివి, ఉత్తేజం కలుగజేసేటటువంటివి అట్లాగే ముసల్మాన్ దేశాల్లోకూడ గొప్ప జ్యోతుల లాంటివారు పుట్టారు అక్కడి వాళ్ళకుకూడా స్వతంత్రభావాలు, జాతీయ ఐక్యత నేర్పారు అటువంటి మౌలానా అబుల్ కలాం ఆజాద్‌గారు గొప్ప తేజస్సుతో 69 సంవత్సరములు మిక్కిలి తీక్షణముగా ప్రకాశించి మన జాతికంతకు వెలుగు ఇచ్చినారు వారు ఒక్క ముసల్మానులకే వెలుగు ఇవ్వలేదు హిందువులందరకుకూడ వెలుగు ఇచ్చినారు అటువంటి వెలుగు ఇచ్చినటువంటి వారు మౌలానా అబుల్ కలాం ఆజాద్‌గారు అటువంటి వెలుగు ఇచ్చినటువంటి మహా వెలుగులాంటి వారు ఆజాద్‌గారు నేటితో ఆ వెలుగు ఆరిపోయింది ముఖ్యంగా జవహర్లాల్ నెహ్రూగారికి చాలా కష్టముగా ఉంటుంది వల్లభాయ్ పటేల్ పోయినాడు అబుల్ కలాం ఆజాద్ పోయినాడు అసలు గురువు అయినటువంటి మహాత్మాగాంధీగారు పోయినారు ఇకముందు భారత దేశాన్ని నడపటములో చాలా ఇబ్బందులు, కష్టములు, సమస్యలు, ఉన్నవి ఒకవైపున ముసల్మాన్ కమ్యూనలిజమ్, రెండోవైపున హిందూ కమ్యూనలిజమ్ ఉన్నవి హిందూ కమ్యూనలిజమ్‌కు చెందిన ఆర్ యస్ యస్ హిందూ మహాసభ లాంటివివచ్చి, మహాత్మా గాంధీని నశింపజేసినవి హిందూ మతపిచ్చగల మతోన్మాదులు మహాత్మా గాంధీని తుపాకిపెట్టి కాల్చారు అట్లాగే ముసల్మాన్ మతపిచ్చిగలవారు ఇత్తెహాద్‌ముసల్మాన్‌కు చెందిన కాసీంరజ్వీగారు ఇక్కడ అనేకమందిని నరకటం జరిగింది ఇప్పుడు రెండు మతపిచ్చిలు ఉన్నవి ఒకవైపున హిందూ మతోన్మాదం, రెండవవైపున ముసల్మానుల మతోన్మాదం ఈ రెండు దేశంలో ఇంకా పోలేదు కాశ్మీర్‌లో షేక్ అబ్దుల్లావచ్చి, మళ్ళీ ప్రజలను రెచ్చగొడుతున్నాడు ఇక్కడ కూడా కొందరు కాసీంరజ్వీ శిష్యులు కొంత ఇబ్బంది కలుగజేయటానికి చూస్తున్నారు ఇటువంటి సమయంలో ఆజాద్ మరణించటం చాలా దురదృష్టకరమైన విషయము వారు మరణించటం మన దేశమునకు ఇంతింత అని చెప్పటానికి వీల్లేనంత దురదృష్టము ఇక భగవంతుడే మనలను రక్షిస్తాడు అన్న ఆశతో మనము ముందుకు పోదాము

మౌలానా అబుల్ కలాం ఆజాద్‌గారు గొప్ప త్యాగవంతులు వారిదగ్గర గొప్ప పాండిత్యము ఉన్నది వారు పండితులు, విజ్ఞాని ఆయన అరబ్ దేశాలలో కల్లా పెద్ద విశ్వవిద్యాలయమైనటువంటి అల్ హజ్‌హర్ విశ్వవిద్యాలయంలో చదువుకొని వచ్చారు ఆ విశ్వవిద్యాలయం కైరోలో ఉన్నది దానిని ఉయా చక్రవర్తులు స్థాపించారు 15, 16 వేలమంది విద్యార్థులు ఉన్నటువంటి విశ్వవిద్యాలయం అది ఆయన నవీన విద్య చదివారు సైన్స్ ఆఫ్ ఫిలాసఫీ చదివాడు ఆయనకు పాండిత్యము, విజ్ఞానము అపారంగా ఉన్నది అటువంటి ధీశాలి, ధార్మిక బుద్ధి కలిగినటువంటి వారు, శ్రీ అబుల్ కలాం ఆజాద్‌గారు ఖురాన్‌కు నిజమైన అర్థము చెప్పినటువంటివాడు ఆజాద్ అటువంటి ధీశాలి, విజ్ఞాని మన నాయకుడు అయినటువంటి శ్రీ మౌలానా అబుల్ కలాం ఆజాద్‌గారు నేడు పరమపదించినారు అందుకు మన సంతాపాన్ని తెలియజేస్తూ, మన ముఖ్య మంత్రిగారు ప్రతిపాదించిన తీర్మానము సభ్యుల ఎదుట ఉన్నది ఈ తీర్మానాన్ని అందరూ ఆమోదించవలసినదిగా కోరుతూ, వారి మరణానికి సంతాపసూచకంగా అందరు రెండు నిముషాలు నిలబడవలసిందిగా కోరుతున్నాను

"That this House places on record its deep sense of sorrow at the death of Sri Maulana Abul Kalam Azad, Union Minister for Education, and one of the greatest leaders of the Indian Nation, and conveys its sincere condolences to the Prime Minister of India and to the members of the bereaved family"

(The resolution was unanimously adopted, the House standing in silence for two minutes)

మిస్టర్ స్పీకర్ —ఈ దినపు ప్రశ్నలన్నీ మార్చి 13వ తారీఖున వస్తాయి మనము 24–2–58 సోమవారము రోజున మధ్యాహ్నం 2 గంటలకు సమావేశమవుదాము ఆ రోజు Non official day గనుక ఆ దినమున అనధికార తీర్మానాలన్నీ వస్తాయి ఆ రోజుననే ఏటి కొప్పాక కార్మికులకు సంబంధించిన చర్చ జరుగుతుంది. ప్రశ్నల అనంతరము ఆ ఒక్కటి మాత్రమే తీసుకుందాము

రెవిన్యూ మంత్రి (శ్రీ కె వెంకటరావు) —ఆ దినమున మంత్రిగారు వేరే ముఖ్యమైన పని మీద వెళ్ళవలసియున్నది అందువల్ల సభకు హాజరుకావటానికి వీలుపడదు గనుక ఏటికొప్పాక విషయము 24వ తేదీకాకుండా మరొక తేదీన తీసుకుంటే బాగా వుంటుంది

శ్రీ పి సుందరయ్య —అలాగైతే 25వ తేదీన పెట్టండి

మిస్టర్ స్పీకర్ —సరే 25వ తేదీనకూడ వద్దు అని అంటున్నారు గనుక ఏటికొప్పాక విషయం 28–2–58 న తీసుకుందాము

శ్రీ పి సుందరయ్య —అనధికార తీర్మానము రోజున అధికార తీర్మానములు తీసుకొని రావడము బాగాలేదు,

మిస్టర్ స్పీకర్ — అయితే దాని విషయం తరువాత చూస్తాను

ఇంతటితో సభ వాయిదా వేయడమైనది

*The House then adjourned till Two of the Clock on Monday the 24th February, 1958*

---